చాలవరేణ్యుఁ డంబురుహసంభవుమాటలు వీనులందు భా
రాళసుధారసప్లవనరమ్యము లై ప్రమదం బొనర్పఁగన్. 92

తే. చక్క జాగిలి మ్రొక్కి యంజలిపుటంబు
ఫాలిఁ గదియించి నిలిచి పములచిత్తా
మధురబహువిధస్తోత్రవిమ్మ్రరచన
మున్నుగా నతఁ డిట్లని విన్నవించె. 93

క. దేవర ప్రసన్నుఁ డగుటకు?
సేవకులకుఁ బడయరానిసిద్ధియుఁ గలదే?
భావితవివిధైశ్వర్యకు
భావహము గదా భవత్కటాక్షం బెందున్. 94

వ. కావున నసురేంద్రత్వంబు నాకు గృపసేయవలయు నిదియ మదీయాభిలాషం బనినఁ బితామహుం డసురేంద్రున కిట్లనియె. 95

చ. సమధికపూర్వదేవకులసంజనితుండవు నీవు నీకు న
య్యమరపదంబు దక్కువ సురాధిపతిత్వము నీక [1]దెంత య
య్యమరవరేణ్యసంపదకు నగ్గల మై వెనుపొందువైభవం
బమరుట యేమిటం గలుగు నట్టివరంబుఁ దలంపు మింపుగన్.

క. అనినఁ దగువరముఁ దనమ
మ్మనమున నూహించి యసుర మఱి యిట్లనియెన్
వనజభవుఁ డింక వీఁ డే
మని వేఁడునో యనుచు నాకులాత్మత [2]నొందన్. 97

1. యంత. 2. నొందన్.

సీ. దేవకులంబుచే దేవ రాక్షసులచేతఁ
బితృకోటిచే దైత్యపతులచేత
గ్రహములచేఁ దారకములచే మునులచే
సకలసమీరాంతోయములచేత
నరులచే గిరులచేఁ దరులచేఁ బశుమృగ
పక్షిదంశకకీటసంతతిచేత
నసికుంతశరపరిఘాద్యాయుధములచేఁ
గాష్ఠపాషాణసంఘములచేత

గీ. నవని నంతరిక్షంబున దివమునందు
వాసరంబులయందు శర్వరులయందు
నా కపాయంబు లేకుండ లోకవంద్య
యిమ్ము మఱి యిప్పుడును నొల్ల నింతనిజము.                98

తే. అనిన నిచ్చితి ననియెఁ బద్మాసనుండు
దైత్యపతియు మహాప్రసాదంబు దేవ
యనుచు నౌదల మోడ్పుకే లమర [1]నొప్పె
హర్షపులకాంకురాలంకృతాంగుఁ డగుచు.                99

వ. వనరుహాసంభవుండు దితిసంభవునిఁ బ్రభూతవరదానసంభావితుం జేసి నిజనివాసంబునకుం జనియె, నసురేశ్వరుండును నమందానందమందస్మితసుందరుం డగుచు నాత్మగృహంబునకుం జని జననికి నమస్కరించి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి తదభినందితుం డై ప్రియానుజుం డైన హిరణ్యాక్షుఁ [2]డను మోదింపఁ బెంపొందుచున్న సమయంబున నమ్మహావీరులతపోలాభంబునకు నభినవోల్లాసంబునం బొంగు

---

1. నొప్పె. 2. నను మోదింప.

నంతరంగంబులతోడ నముచిపులోమబలరాహుశంఖకర్ణవిప్ర
[1]జిహ్వయగ్రీవప్రముఖు లైనదానవు లనేకులు చనుదెంచి
యతనిం గని సముచితసల్లాప[2]సత్కారంబులు వడసి యతని
కిట్లనిరి. 100

మ. దితిసంతానము దానవాన్వయము నీతేజంబు నిత్యోర్జిత
స్థితి నేపారుటఁ జేసి నేఁడు దల యెత్తెం జెర్చి యీదైత్యసం
తతి యంతంతకు నీసుమైఁ [3]బరమ దోర్దర్పంబు [4]సొంపేదఁగా
ధృతిదూలం [5]బడిపాటి దప్పివిరిసెం దేవాహిత[6]శ్రేణియున్.

ఉ. జన్నములుం బరాన్నములుఁ జాలఁగ మ్రింగి కరంబుఁ గ్రొవ్వి
వ్వేకన్నిఁకఁ గ్రాలునచ్చరలయాటలు చిత్తములం గరంపఁగాఁ
గిన్నరవల్లకీమధురగీతులు వీనుల కింపుఁ బెంపఁగాఁ
జెన్నుగ నుండి మమ్ము నొకచీరికిఁ గైకొన రాదివౌకసుల్.

మ. హరి తనకుం గలం డని పురాంతకుఁ డామురవైరినేత లె
వ్వరుసన మాన్ప నొల్లఁ డని పద్మభవుండును నాత్మలోన ని
ర్జరులకు మేలు గోరు నని సంయమికోటితలంపుల న్నిజ
స్ఫురణమ యావహించు నని పొంగుచు నుండు మహేం
ద్రుఁ డెప్పుడున్. 103

ఉ. అట్టిసురాధినాథునద టంతయుఁ బాపి నిలింప[7]వర్గపుం
దట్టము లొగ్గి తాపసులదైన్యము పాల్పడఁ జేసి లోకముల్
గట్టిగ నీవ యేలుము ప్రకాశితదైత్యకులాభివృద్ధికై
పట్టము గట్టి మమ్ముఁ దగఁబంచి పనుల్గొను మీశ్వరుండ వై.

---

1. జిత్తుహయగ్రీవ. 2. సంస్కారములు. 3. బరప. 4. సొంపొం
దఁగా. 5. బడుపాటదప్పి, 6. దేవాహితశ్రేణికిన్. 7. వర్గముల్.

వ. [1]అని పల్కిన నసురులు తత్క్షణంబ భృగువంశభవ్యుండగు
కావ్యు నచ్చటికి రావించి తదుపదిష్టప్రకారంబునం బొడంగి
మహానిర్మితమాణిక్యమయ మహితసింహాపీఠంబున నమ్మహాను
భావు నునిచి భార్గవపురస్సరంబుగా నఖిలతీర్థోదకంబుల
నభిషేకంబు గావించి దైత్యదానవరాక్షసాన్వయంబునకుం
బతిఁజేసి గట్టని పట్టంబు గట్టి వివిధాశీర్వాదంబుల నతనిం
బ్రస్తుతించిన నసురులయార్పులు నిస్సాణపణవకాంస్యకాహ
ళాదితూర్యంబులయులివులు దిక్కులు వగిలించె నంతం
బోనక దిక్పతుల డెందంబుల గాసించె నంత. 105

ఉ. దానవనాథునౌదల నుదగ్రత నొప్పఁగ నాతపత్ర [2]మ
మ్లానసుధాంశుబింబగరిమంబునఁ బెంపెసలారి యింద్రలో
కీనయనోత్పలావళులు ఖేదము నొందఁగఁ జేసె ఘోరఘ
ర్మానుగతప్రచండకిరణాంశులభాస్కరమండలాకృతిన్. 106

సీ. అసురవల్లభుప్రతాపాగ్ని పర్వెడులీల
దిశల నుల్కాపాతదీప్తి పొడిచె
దైతేయనాథునుద్ధతికి నుల్కినభంగి
ధాత్రి సముత్కంపతరళ యయ్యె
దనుజతేజముఁ గని దైన్య మొందినమాడ్కి
మార్తాండుఁ డెంతయు మాఁగువాఱె
విబుధారికినుకకు వెగడొందు తెఱఁగున
వనరాశి కరము ఘూర్ణనము నొందె

గీ. గిరులు వడఁకె నధికపరుషంబు లై పవ
నములు చెలఁగె నిబిడతిమిర మడరె

---

1. అనిపల్కి యసురతక్షణంబ. 2. మమ్లాన.

వహ్ను లగ్రధూమవారితజ్వాలంబు
లగుచుం బొనుంగువడియె నద్భుతముగ. 107

క. అవి యెల్లం జూచి దైత్యులు
దివిజకులాపాయభంగిం దెలిపెడునవె యీ
వివిధోత్పాతము లని ప్రమ
దవికాసితు లైరి దుష్టతామసబుద్ధిన్. 108

వ. ఇ ట్లభిషిక్తుం డై [1]యపూర్వపూర్వగీర్వాణపుంగవుండు గర్వగరిమాక్రాంతస్వాంతుండును నగుచు మయదత్తంబును మణిమయూఖమంజీరమంజులంబును మనోరథానురూపగమనంబును నగుమహారథం బెక్కి హిరణ్యాక్షప్రముఖు లగునాప్తజనంబులు పరివేష్టింప ననేకదానవసేనాసమేతుండై చని మహాశైలదుర్గగోచరయుం బ్రాంశుప్రాకారపరివృతయు నుత్తాలవిశాలాట్టాలకవిలసితయు నుదగ్రగోపురాగ్రగృహీతగ్రహమార్గయు సమధికోత్సేధసౌధవీథితిధవళాయమానదశదిశాభాగయు సకలసమయసముదితసుమనోవికాసభాసమానోద్యానదోహలితరోదోంతరయు సమస్తభోగభూమియు రత్నవతీనామధేయయు నగుమహాపురి భార్గవోపదిష్టశుభముహూర్తంబునం బ్రవేశించి. 109

క. అందుండి సకలసంపద
లుం దనుం జేరంగ నఖిలలోకంబులు న
స్పందితనిజాజ్ఞ నొదల
లం దాల్పంగం దాల్చె రాజ్య[2]లలితోత్సవముల్. 110

1. యపూర్వ. 2. లీలోత్సవముల్.

క. దైతేయులు దానవులును
భూతనిశాచరపిశాచములు తద్దయు సం
ప్రీతిం బొదలంగ నాతని
యాతతసామ్రాజ్య మంతకంతకుఁ బెర్చెన్. 111

తే. అహితకర్కశపుదైత్యేశ్వరుం డెంతవ
ర్తిల్లఁ బోడఁగె నంత పవిజకులము
పేర్చి తలఁగఁ జొచ్చెఁ బెచ్చు వేసవియెండ
నెకలి యువ్వసఁచిలుఁ దమగుంపుపోలె. 112

క. సైన్యము గొని దైత్యుఁడు దు
ర్వారభుజాదండరోషరభసాకులుఁ డై
కారింపఁ బోఁడఁగె నమరులఁ
బోరులు తనకు స్వవినోదములుగాఁ గడిమిన్. 113

స్రగ్ధ. వేదండోద్దండహేలావితతరథపదాతివిస్ఫూర్తిస్వీయభా
స్వత్తాపదాతానేకసేనాప్రకరపరికరప్రాభవాభీలలీలా
వైదగ్ధిం బేర్చి దైత్యేశ్వరుఁడు రణధురావాంఛఁ బైకొన్న
మాత్రే, ఖేదింపం ద్రుంప నొంపఁగ బలుసనక విజృంభింప
నోర్వ న్నిలింపుల్? 114

వ. అమ్మహావీరుండు. 115

సీ. పేర్చుచుఁ బఱతెంచుభిదురంబు నని మొనఁ
బెడచేతఁ బెడమోము వడఁగ నడఁచి
ఖతిఁ బాతెకిపురుహూతు వెన్కొని బాహు
దల వట్టి దర్పంబు దలకు మీఱి

1. పగఁగ. 2. [illegible]

సమరావతీపురం బంతయుఁ జూఱాడి
చెలఁగి సురస్త్రీల చెరలుబట్టి
వెల్లయేనుంగును వెలిమావుఁ గైకొని
మందారమును హరిచందనంబు
గీ. పారిజాతసంతానకల్పకతరువులఁ
గొని సుమేరునిచితరత్నకోటిఁగొండ
లర్థిఁ ద్రవ్వి తండము గొని యమరవిభునిఁ
గరుణ [1]ముంచల విడిచి విక్రమము మెఱసి. 116

వ. మఱియును. 117

ఆ. శిఖలు చూపకుండ శిక్షించి [2]హావికి నై
నోరు వెఱవకుండ మేరవెట్టి
వేఁడియెల్ల నుడిపి విబుధారి కినుకమై
భీతిపాత్రుఁ జేసె వీతిహోత్రు. 118

సీ. మెచ్చక యెదురైనమృత్యువు మెడ ద్రొక్కి
క్రొవ్వాఁడికోఱలు ద్రెవ్వ రాచి
కిన్కతో జంకించి కింకరకోటులఁ
బొంకంబు చెడఁ గొంకువోవ నడిచి
మదుర్వుఁ గొని మూఁపుమలయుకా తెనుపోతు
నొడిసి కొమ్ములుపట్టి ముడుఁగఁ ద్రోచి
మండెడుపటుకాలదండంబు చేతులఁ
బిసికి వేఁడిమి యార్చి బెండుచేసి
గీ. వేదప్రాణులఁ బొరిగొనుబిరుదమగఁడ
వగుదు వీ వని యందంద మొగముమీఁదఁ

1. ముంచలవిడిచి అనుట లెస్స. 'జీవముతో విడిచిపెట్టి' అని అర్థము. 2. హాలికి, హాలిక్కి.

జప్పటలు వెట్టి దైత్యులను జమునిలాప్రఁ
జేసియును బొల్లగాఁ గావు సేసి విడిచె. 119

క. వక్క సుఁడు వయ్యు నసురుల
ది క్కొఁకరిగితి వాయు [1]వివిధిం బొమ్మనుచున్
ద్రొక్కఁగ [2]నడిచె నిశాచరు
నక్కజముగ నసురపతి గదాహతి నాజిన్. 120

సీ. లీలమైఁ బాతాళమూలంబుదాఁకను
సలిలధిసలిలంబుఁ గలఁచి పొచ్చి
జలములు ద్రొక్కఁగ సకలరత్నంబులు
[3]వెఱఁజి సాగరపతి వీడుకొలిపి
మకరకర్కటకగ్రాహమత్స్యమహానాగ
బలములు బలుసిడి బారిసమరి
క్రూరదుర్వారదారుణపాశనివహంబుఁ
దోరంపుఁగడఁకఁ దుత్తుమురు చేసి

గీ. పశ్చిమాశాధినాథు [4]విపశ్చిదర్చ
నీయగాంభీర్యు నైతేమనాయకుండు
సమరతలమున భంగించె సకలదైత్య
సమువయంబును నానందజలధిఁ దేల. 121

క. జవమును బలమును బొలుపఱి
భువనంబుల నెందుఁ దిరుగుపోఁడిమి యెడలన్
బవమానుం డవమాన
ప్రవిహతమతియయ్యె నసురపతికోపమునన్. 122

---

1. నీవిధిం. 2. నడఁచె. 3. వెఱచి. 4. విపశ్చదర్భ

క. నవనిధులు పుచ్చుకొని భ
వ్యవిమానము నాచికొని సురారి కడిమిమై
భవసఖుఁ డితఁ డట్టిఁడ కా
యవు నని భిక్షుకుఁ జేసె నయ్యక్షేశున్. 123

ఉ. ఎక్కడి పెద్ద భూతిరయును నెమ్ములు సొమ్ములు భిక్ష జీవనం
బొక్కటి కట్టఁజీరయును నుండఁగ నిల్లును లేదు నిక్కువం
బిక్కఱకు [1]న్దపస్విజనుఁ డేచిన నయ్యెడు నేమి యంచుఁ దా
నొక్కని శర్వుని న్బలుప నొల్లఁడు దైత్యుఁ డనాదరంబునన్.

వ. ఇవ్విధంబున సకలదిక్పతుల న్బరిభవించి తదీయపదంబులుం
దాన కైకొని మాఱు లేక మలయుచును సర్వదేవైకభీకరుం
డై విజృంభించి. 125

సీ. వనరాశిజలములు వడిఁ ద్రిప్పుకొనులీలఁ
గలఁగించు [2]మందరాగమ్ముకరణి
నంబుజప్రియకుముదాప్తులఁ జోరిఁ బట్టి
బాధించు సింహికాప్రభవుభంగి
ఘనగోత్రగోత్రశృంగంబులు వెసఁ దాఁకి
పొడి చేయుఁ దీవ్రదంభోళి పగిదిఁ
బ్రబలవలాహకప్రకరంబు వ్రచ్చి వం
దఱలాడుఁ బటుమారుతంబుమాడ్కి

గీ. దిగ్గజంబులగుండెలు దిగులుకొల్పు
ఘోరరవమునఁ గ్రూరమృగారిపోల్కిఁ
బ్రకటభుజదర్పమునఁ దన్నుఁ బట్టలేక
దుర్నివారుఁడై హిరణ్యాక్షుపూర్వజుండు. 126

1. దపస్వివులు లేచిన. 2, మందరనగరము.

సీ. తపములఁ గ్రుస్సినతపసులఁ బట్టి తె
ప్పించి యచ్చరలతోఁ బెండ్లి సేయు
మోదంబుతో సశ్వముఖులలాయంబులఁ
గట్టి బొక్కసియులఁ గవణ మెత్తు
భుజగేశ్వరులశిరంబునకున్న మణు లూడ్చి
కొమరార వట్టువగుండు లెత్తుఁ
జెలఁగి గంధర్వులచేతవీణెలు పెరా
మల కిచ్చి పాడించి చూచి నవ్వు
గీ. ఖడ్గములఁ బాదుకలు ఘుటికములు సపహ
రించి సిద్ధపుంగవుల గారించుచుండు
భువనబాధలు దన కిట్టు ప్రొద్దువోక
లుగ సురారాతి పేర్చె నుల్లోకుఁ డగుచు. 127
క. పరభిమతము లగు¹ మఖముల
విదితముగ 'హిరణ్యకశిపవే స్వాహా' య
న్నదిదక్క మంత్ర మొండె
య్యది చొరకుండఁగ సురారి యాజ్ఞాపించెన్. 128
చ. సరసిజసంభవుండు హరి శర్వుఁ డనంగఁ గలారె వేఱె యొ
క్కరుఁడు జగత్త్రయంబునకుఁ గర్తయు భర్తయు సంప్రహ
ర్తయుఁ, దిరముగ నేన కాక యని దేవకులద్విషుఁ
డాగమక్రియా, కరులకుఁ దన్నుఁ గొల్వుఁ డని గర్వమున
న్నియమించె నెల్లచోన్. 129
సీ. భానుఁ బిల్పించి నాపంపున బాయని
తెరువరి వై మీఁదఁ దిరుగు మనియెఁ

1. దుఃఖము.

జంద్రునిఁ బిలిచి నాశాసనంబున జగం
బున నెల్ల నోషధుల్ ప్రోవు మనియె
ననిలునిఁ బిలిచి నాయాజ్ఞఁ బ్రాణుల కెల్ల
వలయు ప్రాణంబవై మెలఁగు మనియె
ననలునిఁ బిలిచి నాయానతియందునఁ
[1]బాకాదికర్మోజ పలుపు మనియెఁ

గీ. దనచరిత్రంబె వర్ణింపఁ బనిచె బహువి
ధేతిహాసపురాణార్థజాతి నెల్లఁ
దన్ను వినుతింపఁ బనిచె వేదముల నెల్ల
దైత్యనాయకుఁ డఖిలవిధాయకుండు. 130

మ. జముఁడై తాన సమస్తకర్మగతులుల్ శాసించు శీతంబు నూ
ష్ణము వర్షంబును దాన యయ్యయితఱిన్ సంధిల్లఁగాఁ
జేయు న, ర్థముఁ గామంబును దాన కైకొని ప్రమోదం
బందు ధర్మంబు మోక్షము నాత్మీయకటాక్షలక్ష్యము
[2]లనుర్ గర్వోత్కటసార్వంతుఁ డై. 131

ఉ. నేలయుఁ గొండలుం దిశలు నింగియు దీవులు నంబురా
సులుల్, గాలములుల్ గ్రియావళులు గాడ్పులు వహ్నులు
నాకమర్త్యపా, తాళములు న్నిజాకృతులు దాల్చి సరో
రుహాసూతిఁ గొల్చున, ట్లాలఘుశీలుఁ [3]గొల్వ సదయాత్మత
యేర్పడ వచ్చు నిచ్చలున్. 132

వ. ఇట్లు లోకపరమేశ్వరుం డగునసురేశ్వరుండు నిరంత
రైశ్వర్యుండును, గురుభుజవీర్యుండును, దివిజమర్దన

1. పాలికాదికమోజ. 2. లనర్. 3. గొల్చు.

కార్యంబులు సఫార్థంబులై చెల్లుచుండఁ జండప్రతాప
దీపిత త్రిలోకుం డగుచు ననేకసంవత్సరసహస్రంబులు
సామ్రాజ్యంబు సేయుచుండ నాఖండలప్రముఖబృందారకు
లంతయు నవహాస్యంబునఁ గూడఁబడి గురునితోఁ గర్తవ్యం
బడిగిన నమ్మహామతి మరుత్పతి కిట్లనియె. 133

క. నీతులఁ ద్రోవఁబడని దు
ర్నీతునియుద్రేక మెసఁగి నిగిడినయెడ లో
కాతిక్రమహేతు వగు న
హేతుకళాభాసనంబు నెమ్మెయిన నగున్. 134

చ. కడిఁదివరంబు వారిరుహగర్భునిచేఁ గొనినాఁడు వాఁడు మీ
యెడ ననిశంబుఁ జెన్నగను నీసును రోషము నెమ్మనంబులోఁ
జడిగొని యుండుఁ గావున ససాధ్యుఁ డసాధ్యుఁడు దైత్య
నాథుఁ డే, వసువునఁ బౌరుషంబుఁ గొని వాని జయించుట
వ్రేఁగు చూడఁగన్. 135

సీ. సామంబుచే శత్రు సాధింత మంటిమా
సామంబు ఖలునందు సేమమగునె
భృత్యులతో దాయ భేదింత మంటిమా
యసహాయసాహసుం డసురవరుఁడు
దానంబు వశ్యవిధాయక మంటిమా
[2]మెల్ల మెల్లనువాఁడు కొల్లగొనియె
దండితనంబున దండింత మంటిమా
చెనసి యజేయు నిర్జింపరాదు

1. నీతులచేఁద్రోవఁడు దుర్నీతుని. 2. మెల్లమెల్లను.

గీ. కానఁ జతురుపాయంబులు కార్యసిద్ధి
జనకములు గావు మఱి మూఁడ సంధివిగ్ర
హాదు లైనషడ్గుణములు నప్రయోజ
నములు పగతుఁడు ఘనుఁడు దుర్దముఁడుఁ గాన. 136

క. స్థానంబును వృద్ధియు న
ద్దానవపతియందు నంచితములై నవి దే
వానీకము సంక్షయగత
మైనయది త్రివర్గతత్త్వ మారసిచూడన్. 137

వ. స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలంబులను సప్తాం
గంబులును సంపన్నంబులై తదీయసామ్రాజ్యంబు రిపులకు నభి
యోగ్యంబు గాకుండుటయు నాకౌకసులకు నమ్మహిమవిగతం
బగుటయుఁ బరమేష్ఠిదత్తవరలాభంబున నుదయోన్ముఖుం
డైనవాఁడునుం గావున నసురకుం గాలబలంబు సమధికం
బగుటయుఁ ద్రిలోకంబులును దనయధీనంబులుగాఁ గైకొని
యున్నవాఁ డగుటం జేసి దైవబలంబు సిద్ధం బగుట యవలం
బింపవలయుట నాకుం దోఁచినకర్జం బది యట్లుండె వెండియు
నొక్కతెఱంగు చెప్పెద. 138

ఉ. కామక్రోధమదాద్యమైనయసుహృద్వర్గంబులన్ గెల్వ నే
ధీమంతుండు సమర్థుఁ డాతఁడు విరోధివ్రాతముం గెల్చు నీ
కామక్రోధమదాదినిర్జితుఁడు దుష్కర్ముండు నై యుండు వాఁ
డీమై నెవ్వరిచేత నేనియు రమాహీనుం డగుఁ బ్రేల్మిడిన్.

క. అజితాత్ముఁ డైనయాతని
విజయంబును సిరియు విరియు వేగంబ శర

త్ప్రజనితజలధరములు గదు
నిజము లగునె యంబరమున నిముసం బైనన్. 140

మ. దితిజుం డిప్పుడు కామరోషములు నుద్రేకించి లోకంబు దుః
స్థితి నొందించుచు నున్న వాఁడు విభవాంధీభూతచేతస్కుఁడై
మతిహీనుండును బోలె సౌఖ్యనిరతిన్ మత్తిల్లియున్నాఁడు ని
ర్జితుఁ గావింపఁగవచ్చు దైవకరతన్ జేకుర్ప నీ యాపాతకున్.

క. విజయాభిమానతృప్తి బ
హుజనవ్యేషుఁ గామసంవృతో న్మాద విహా
రజితుని వెసఁ బోడరంగా
విజయం బగు ననిరి నీతివిస్తరవేదుల్. 142

క. తనుఁదా నెఱుఁగనివానికిఁ
దనుఁదా దండించుకొనిన కాముసునకు నెం
దును దైవబలము లే దిం
త నిరాఘతఁ గనినసిరియుఁ దప్పక పోఁచున్. 143

వ. మనకు దైవంబు దాతయు వాసుదేవ్రుండ. మనకేయనేల
యనేకబ్రహ్మాండకోటిజాతంబు లైనచరాచరభూతంబులకుఁ
బరాయణంబు నారాయణాభిధానం బగుతేజంబ. ఈజ
గంబుల సంకటం బుడుప నాదేవ్రునకు నపరిహార్యంబు మనమిమ్మ
హాత్ము శ్రీపాదపద్మంబులు చేరి మనతెఱఁగంతయు విన్నవిం
తము. మున్ను చెప్పితి హరి శరణాగతుల యాపదలఁ బాప
నోపు. నాపురుషుండు మనకు నెయ్యదిక ర్తవ్యంబుగా నాన
తిచ్చెఁ దత్ప్రకారంబున నపకారులకుఁ బ్రతీకారంబు చేయుద
మిదియ నిశ్చయంబు గావున. 144

మత్తకోకిల.—

రండు పోదము రెండు వేగమ ప్రస్ఫురత్కులిశాయుధా
ఖండఖేలనహేతిభీతసగవ్రజాభయదాయితా
చండచండతరంగసంభ్రమసంప్రవర్ధికి వార్ధికిన్
బుండరీకదళాక్షమందిరభూమికిన్ మహినేమికిన్. 145

వ. అని సురలకు [1]గురుండ వితథం బగునీతిపథంబునన్ బరమ
హితం బుపదేశించె నని దేవశ్రవునివలన గాలవుండు వినిన
పథంబు విశదవిస్తారంబుగా నుపన్యసించె. 146

ఆశ్వాసాంతము

క. శ్రీతులసీదళదామ
ద్యోతారుణహారికిరణయుతకౌస్తుభర
త్నాతపరచితేంద్రధను
స్స్ఫీతనవీనాంబుధరగభీరశుభాంగా. 147

భుజంగప్రయాతము.—

మహాంభోధికల్లోలమాలావిలోల
న్మహాభోగిశయ్యా[2]సమాక్రాంతకేలీ
[3]మహాశుక్తిముక్తోపమానాత్మమాయా
మహాయంత్రకభ్రామ్యమాణత్రిలోకా. 148

క. వైకుంఠనాథ, సమద
శ్రీకంఠగ్రహణనిపుణశీల, విరించి

1. గురుండు వితథంబగు. 2. సనాక్రాంత. 3. మహాశక్తి.

శ్రీకంఠాదికమూర్తిమ
యాకుంఠనిజైకచిన్మయాకార హరీ. 149

స్రగ్విణి. సత్యసజ్జ్ఞానచిత్సంగసంగప్రియా
సత్యసత్యాంతరోత్కృష్టతత్త్వస్తుతా
నిత్య నిత్యోదితోస్మిప్రసిద్ధా, సదా
దిత్య, దిత్యాత్మజోద్రేకరేఖాపహా. 150

గద్య. ఇది శ్రీశంకరస్వామిసంయమీశ్వరచరణసరోరుహ ధ్యానానందసౌందర్యధుర్య శ్రీసూర్యకవిమిత్రసంభవశంభు దాసలక్షణాభిధేయ ఎఱ్ఱయనామధేయప్రణీతంబైన శ్రీ లక్ష్మీనరసింహావతారంబను పురాణకథయందు ద్వితీయా శ్వాసము.

శ్రీ ర స్తు

# తృతీయాశ్వాసము



¹మద్గరుడాచల
ధామ సుధాధామతీవ్రధామసహస్రో
ద్దామద్యుతితేజోనిధి
సీమ శ్రీమహితదేహా శ్రీనరసింహా. 1

వ. దేవా రోమహర్షణుండు మహర్షుల కిట్లనియె. నంత బృహస్పతిమతంబు తమకు నభిమతంబుగా నేకమతంబున నమృతాశనులు సముచితాసను మున్నిడుకొని యప్పావిద్ధు కవలి యుత్తరాభిముఖులై చని. 2

మహాస్రగ్ధర.—

కనిరుగ్రగ్రాహనక్ర²క్రమణఘుమఘుమాకారకల్లోలడోలా
స్ఫాలన³ప్రద్యోతకేళిసరభసఫణభృచ్చారుజూటాగ్రజాగ్ర
ద్ఘనతోన్మదంచితో⁴ద్యత్కటు కుటిలమయూఖచ్ఛటాటోప
మిథ్యా, జనితౌర్వారంభశుంభత్సలిలనివహనిస్తంద్రరత్నా
కరేంద్రన్. 3

---

1. శ్రీశ్రీమద్గరుడాచల. 2. గ్రహ. 3. 'ప్రత్యూష' ఐయుండును.
4. త్కట.

శా. ఈవారాశికి దానభూషణముగా [1]నీదీవి శుభ్రాంబుజ
శ్రీసంభావితమయ్యె దీనినడుమన్ జెన్నొందు హేమోజ్జ్వలం
బై వైకుంఠపురంబు కర్ణిక తెఱం గారంగ సమూర్జిత
శ్రీవత్సాంకునిఁ జూతమింకఁ బ్రమదస్థేముల్ మహాభీంద్రుఁగాన్.

క. అని పలుకుచుఁ జిత్తంబులు
ఘనతరభక్తిరసభరితకలితములై పే
ర్చిన సమరవరులు నిజకర
వనరుహపుటఘటితనిటలవన్యస్తకులై. 9

శ్లోకము. శ్వేతద్వీపాయ సంసారతిమిరశ్వేతభానవే,
నమః కైవల్యకంఠాయ వైకుంఠనగరాయ చ. 10

వ. ఇట్లు తొడంగి బహువిధస్తోత్రనాదంబులు రోదోంతరంబున
మేదురంబులుగాఁ బురంబు సొత్తెంచి రాజమార్గంబున రాజ
మందిరాభిముఖులై వచ్చువిపిజాలకలకలం బాకర్ణించుచు
వైకుంఠనాథుండును ననాథనాథుండును జగచ్ఛ్రీనాథుండు
నాకౌకసులం బడయక తోడ్కొని తేర వైనతేయు నాన
తిచ్చి పుచ్చిన. 11

సీ. భాసురసౌవర్ణపక్షయుగ్మముకంటెఁ
బ్రకటితం బగుబంధుపక్ష మమర
నంచితహరిచందనాంగరాగముకంటె
రాజితం బగుముఖరాగ మెసఁగ
లాలితహారాద్యలంకారములకంటెఁ
బూరుషాకారంబు భూషణముగ

1. నీదేవి.

కైటభాసురశిరోవిదళనంబునకుం దగినవేళ వచ్చె నింకను
హిరణ్యకశిపువక్షోవిదారణంబునకుం గారణప్రదేశం బయ్యె
డునని జతనంబునం బోషించి పాటించినయనువున గనకాంబర
సంవృతం బగుచు నొప్పారునూరుయుగళంబును, నాభికమల
కంపళితంబులగుచు [1]నెలదూడు మొలకలపాలుపుఱంగటితట
ఘటితరత్నశృంఖలోపలంబుల మించుచెలువు దోఁచు[2]తఱుల
మెఱుంగులును, గల్పారంభకాలంబున *నభ్యంతరస్థితభువన
ప్రపంచంబు వెలువరించుటవలనం గృశీభవించిన సుక్షీణాకా
యనందగువృత్తసుందరం బై లలితవళికలితంబు నగుమధ్యం
బును, నేత్రానందనంబు జేయుచ యగుకౌస్తుభరత్నంబునం బెలయు
తననీడఁ జూచి యొక్కొకమాటు ప అపున నితరసుందరి
యనుసందేహంబు నొంది యాందోళించు డెందంబునకొక్కింత
వడి యసూయాసౌందర్యంబునం జిలికించునిందిరకుం బ్రియ
మందిరం బై యనవరత సురభిసురుచిరతరుణతులసీదళదా
మంబునం బొదలురుచిసముదయంబుల సమధికశ్యామా
యమానంబు లగుభుజాంతరంబులును, సిరినెఱకొంగిటం
గఱచుచనుముక్కునొత్తునం గమలినచోటి కందుచందంబున
లలితాలంకారం బై కనుపట్టు శ్రీవత్సలాంఛనంబును, దేవాది
చతుర్విధభూతనిర్మాణంబునకుం జతురాగమధర్మప్రతిష్ఠాపనం
బునకు లోకపాలచతుష్టైశ్వర్యప్రదానంబునకుం జతుర్ముఖము
ఖకపోలస్పర్శనోపలాలనంబునకు నొక్కొకవరుసనచాలి చరి
తార్థతం బొంది మణివలయమండితంబు లై యాఖండలీయం
బగుమత్తవేదండంబు నఖండదంత[3]దండంబులుం బోలెఁ బ్రిరే

1. నెలంజడు. * అభ్యంతరిక. 2. తఱుచు. 3. దంతంబులుం.

తనంబున నిగుడు వెడఁదకన్నుఁగవను నిజదెసలకర్ణోపాంతం
బులు విశ్రాంతిసేయ నగుటకుం దగి నడుమం దాన నిలిచి యనా
యతంబై సుగంధఘ్రాణపవనపరిమిళితపుటోభాగం బగుచుఁ
దన రారుఘనతరఘ్రాణంబును, దెలిమోముచందురుం గొలువఁ
జేరినకుముదవదనవికాసంబుల మాసరంబుల మాడ్కి నలు
దిక్కులం బిక్కటిల్లు నుత్ఫుల్లలోచనరుచినిచయంబులును
సకలసురాసురస్థితివిలయంబులు నిజకటాక్షవిక్షేపవిభవంబు
లకు నధీనంబులుగాఁ జెంపారుతొంగలి ఱెప్పలయొప్పిదంబు
మీఁదఁ బ్రతిబింబించె నన [1]నపూర్వవిలసితంబు గలిగించు
భ్రూయుగంబును, శిరోభూషణపద్మరాగరత్నంబునఁ బరఁగు
రాగంబు గలయఁ బర్వి కెంబట్టు తెఁసుట్టినయట్టియుట్టిలంపుఁ
బొలుపు పుట్టింపఁ జెంపారువిశాలమాళి సన్నాహంబును
నగుచు నఖిలమునిజనధ్యేయప్రకారం బైనయాకారంబు
నిర్వికారసంస్కారంబుల నుదారంబు లగుచునుండ, నిబిడాం
జనశ్యామం బగునిజదేహధామంబు బహుళస్తోమంబునఁ
దత్ప్రదేశంబంతయుఁ గోమలతమాలపల్లవోపహారంబులు
విస్తారంబు లైనమాడ్కిం జూడ్కులకు వేడ్కలు నిండింపఁ,
బ్రౌఢపర్యంకభుజంగఫణామణిమరీచులు మేనం గలయ బెరసి
జలనిధివీచికాస్ఫాలనలగ్నంబు లగుప్రవాళాంకురంబు లను
శంక నంకురింపఁ జేయ మహారత్నరచితంబు లైనసభాస్తంభ
తోరణకవాటకుట్టిమకుడ్యవేదీవితానాదులను దేజోమహనీ
యంబు [3]లగునభ్యంతరశరీరంబులను బ్రతిఫలితమైననిజ
మూర్తి దా నఖిలచరాచరాంతర్గతుం డగుట ప్రత్యక్షంబుగా

---

1. అపూర్వవిలసితంబు. 2. బగుచునుండ. 3. లగు నభ్యంజన శరీరంబులను.

వెలుఁగు బూసినతెఱంగునఁ దేజరిల్ల సాగరకన్యకాకరసరో
రుహాస్తోమభూషితంబు లై మొగ్గయు మధుకరంబులు
సాకారంబులై కొలుచునకలశబ్దమంత్రాక్షర జాలంబులకు
ననుగుణంబులై కలసి మెఱుఁగ, మూర్తంబులై సర్వాగమం
బులు నేమేమి యని యుత్తమాంగంబులు మంగళచరణపీఠం
బులు గా నమర్చి యొగ్గి దగ్గఱికొలువ, సుపవిత్రతీర్థాలా
పంబులు గోరి యశేషధర్మవిశేషంబులు నంగీకృతాకృతులై
చేరి కృపాకటాక్షంబు లపేక్షింప, సర్వలోకశరణ్యుండును,
సర్వదేవారాధ్యుండును, సర్వయోగార్థగమ్యుండును
నగుచు శ్రీదేవీవిలోచనచకోరంబులు నిజవదనేందుచంద్రికా
ప్రవాహంబుల నోలాడుచుండ, నాత్మీయమనోరథమధుపం
బులు తత్కటాక్షమధురసంబులం దనివిలేనియనుభవం
గ్రోలి క్రాలుచుండ, నమ్మహాదేవి నెమ్మేనుఁదీఁగ నిజబాహు
శాఖలం బెనిచి ధన్యవిలాసంబుల భాసిల్లుచుండఁ, బుండరీ
కాక్షుం డయ్యును ననురక్తావలోకనుండును, నీలవర్ణుం
డయ్యును దరహాసధవళితకపోలుండును, గమలాకళత్రుం
డయ్యును వివాహకౌతూహలియును, నిరంతరవనవాసియ
య్యును ననంతభోగేశ్వరుండును, గుణరహితుం డయ్యును
సాధుజనపూజనీయుండును, జన్మవిముఖుం డయ్యును భవ
ప్రియుండును, గోత్రోద్ధరణసమర్థుం డయ్యును సమస్తలోక
బాహ్యుండును, విగతబంధుండయ్యును సతతసన్నిహిత
పితామహుండును నగుచుఁ బుణ్యంబులకు నాధారంబును,
నాపదలకుఁ బ్రతికారంబును, నధర్మంబునకు నవమానంబును,
మంగళంబులకు నాస్థానంబును, సత్యంబునకుఁ బరమమిత్రం

బును, నాగమూర్ధంబులకు నాభిసూత్రంబును, రక్షకు మూలంబును, మోక్షంబునకు నాలవాలంబును, విజ్ఞానం బునకు నిర్దేశంబును, బూజాస్తోత్రంబులకు నభిగమ్యప్రదే శంబును నగుచు నొప్పుచున్న దేవాదిదేవుఁ, బురాణ పురుషుఁ, బురుషోత్తముఁ, బ్రకృతిపురుషుఁ, బరమా ధీశ్వరుఁ, బరమేశ్వరు నంత నాలోకించి. 14

క. అంతంత చాఁగి మ్రొక్కుచు
బృందారకు లధికభక్తి [1]భీతివికాసా
నందంబులు డెందంబుల
నందడి గొని మస్తకప్రశస్తాంజలులై. 15

క. ఆవిశ్వరూపరూపము
భావించుచుఁ దత్ప్రభావభంగుల మది సం
భావించుచుఁ దత్పరమతు
లై వినుతింపంగఁ దొడఁగి రప్పరమాత్మున్. 16

ఉ. శ్రీవసుధాకళత్ర సుతసీసుమకోటిమనోజ్ఞగాత్ర నా
యావిహిత త్రిలోక నిగమార్థవివేక విపాకభవ్య సం
సేవక సౌమ్యమానసవశీకృతరూప భవాంధకారని
ర్ధావనదీప దీప్తనవతామరసేక్షణ విశ్వలక్షణా. 17

చ. భవదురునాభిరంధ్రభవపద్మరజఃపరమాణుపాకసం
భవుఁడు విధాత, తన్విమలభావకళాకణమాత్రవైభవో
ద్భవము జగంబు, తద్వివిధభంగికసర్గములోన నొక్కరుం
డివి యని నిశ్చయింపఁగలఁడే భవదీయగుణంబు లచ్యుతా.

1. భీకవికాసా. ౨. విపాకభవ్య. ౩. పరిమాణ.

మ. ఎందును నిన్నుఁ గన్నజను లెందునుగల్గరు వెండి గొబ్బెసం
జేయవు నిన్ను నెవ్వెఁడలఁ జేయని క్రించులభక్తి, నొక్కటిన్
బొందు గొనంగఁ జాలు కృతపుణ్యులు గల్గినఁ జాలువారికిన్
బొందగునే లబత్కపణా, పుణ్యయశోమహానిధి మాధవా.

శా. విన్నంజాలు భవన్మహత్త్వము భవద్విజ్ఞానసద్గోష్ఠియం
దున్నంజాలు భవత్పదాంబురుహసేవోత్సాహసంపన్నులం
గన్నంజాలు భవత్సమంచితజగత్కల్యాణనామంబుఁ జే
కొన్నంజాలు నఖండశాశ్వతశుభారూఢుండు లక్ష్మీశ్వరా.

ఉ. ఆకట యోగయుక్తులు సమంచితసత్త్వసమాయుక్తులా
లక్షితసత్యధర్ములు విలంఘితకర్ములు బుద్ధికల్పితా
పాకృతపాపరూపులు నిరాకృతకోపులు సంయమక్షమా
శిక్షితు లక్షణుల్ నినుభజించుమహాత్ములు నీరజోదరా. 21

మ. తమనీయపూర్వవాసనలఁ దత్పరులై విభాగమోక్షకృ
త్యములు వహించిభవ్యసత్త్వమున యుక్తిపూజలం బ్రయ
త్నమునఁ దలంచుసంయమమనస్కుల కెల్లను జేయుచోటు శ్రీ
రమణా భవత్పదంబు సుచిరస్థితి నేలుల కబ్బిచాప్పునన్. 22

ఉ. విద్యల కెల్ల నాద్యుఁడును వేద్యుఁడు నై తనరారునిన్ను న
భ్యుదయకర్మరూపముగ నల్లమునం దలపోసి యొంతయుం
జోద్యపుభక్తి యజ్ఞపురుషుం డని పూనిభజింతు రెందుఁ[2] త్రై
విద్యులు [3]నాకలోకపదవీప్రదదీప్ర త్రిలోకనాయకా. 23

శా. దృష్టాదృష్టఫలస్పృహావిముఖులై దివ్యాత్మతత్త్వక్రియా
సృష్టిం బ్రస్ఫుటతీవ్రబోధమున నుత్సేకించి యవ్యక్తసం

1. వహించె. 2. త్రైవిద్యులు. 3. నాకలోకపదవీపదవిప్ర.

సృష్టిఁ బాసి నిస్త్ర[1]వైకృతుఁడౌదాసీనాత్ము షడ్వింశు వి
స్పష్టైశ్వర్యుఁగ నిన్ను సాంఖ్యులెలమిన్ భావింతు రాత్మేశ్వరా.

చ. యమనియమాభివర్ధితము లై మగుడంగ మనశ్శరీరముల్
శమితములుగా మరుచ్ఛ్వయము సంతతజీవపరాత్మతత్త్వరూ
పములు విశేషమై మఱపు పాటిలి కాలము మ్రింగి యోగివ
ర్గము గను చిత్సుఖానుభవగర్వము సర్వము నీవ కేశవా. 25

చ. కరగుణదార్ఢ్యసంపదము పాశము లై తనుఁజుట్టుదూలుచున్
[2]దిరిగెడుజీవుఁడున్ గురుని దేశికపుణ్యకటాక్షసిద్ధిఁ ద
త్త్వనిరూఢిఁ జేరఁగా నఖిలబాధవిముక్తి శుభంబు నిచ్చు నీ
శ్వరుఁడుగ నిన్నెఱుంగుదురు శైవులు శాశ్వతచిన్మయాత్మకా.

ఉ. దాస్య మొకండె ముఖ్యపరమధర్మముగాఁ గొని యన్యధర్మ మా
శాస్యముగా గణింపక యసంశయనిశ్చలభక్తిసంతతో
పాస్య నశేషధర్మపురుషార్థభవైకవిధాయి నిన్ను నా
నన్యత[3] బాంచరాత్రులు దలంచి భజింతురు భక్తవత్సలా.

శా. ద్వైతభ్రాంతివికల్పితం బఖిలముం స్వప్నేంద్రజాలోపమం
బై తూలన్ పృథురజ్జుసర్పసదృశవ్యామోహవిచ్ఛేదనం
బై తత్త్వజ్ఞత యావహిల్లి యపరోక్షాభేదచిత్[4]సౌఖ్య వి
ఖ్యాతుంగాంతురు నిన్ను నౌపనిషదుల్ కళ్యాణనారాయణా.

శా. ధ్వస్తాశేషమతాఖిలాత్మతను చేతశ్శుద్ధులుక్తాంగవి
న్యస్తప్రస్తుతమంత్రవర్ణులు నిరస్తాలస్యు లంతశ్శమా

1. వైకృతనిదాసీనాత్ము. 2. దిరిగెడుజీవుఁడున్. 3. పంచరాత్రులు.
4. చిత్సౌఖ్య.

భక్తస్తోమస్తుత్యపదీయ మూర్తికిఁ బ్రాజ్ఞుల్ మహామాంత్రికుల్, [1]హస్తోచ్చాట్యసురాంఘ్రికం బయిన నిన్నర్థించు దాసుల్ హరీ. 29

క. వేదము లాదిగఁ గలయ
ష్టాదశవిద్యలకు నీవ ప్రవృత్తప్రవర్త
ద్బోధకులును భవదాజ్ఞా
పాదకులు సమస్తధర్మపాలనపటుతా. 30

సీ. జలములు సృజియించి జలములయందు నీ
యంచితబీజంబు నావహించి
యది యప్రమేయమహాద్భుతాండస్వరూ
పంబునఁ బెంపారెఁ బద్మభవుఁడు
జనియించె నందుఁ దజ్జాతులు భృగుమరీ
చ్యాదులచేత సురాసురాది
వివిధభూతోద్భవవిస్తార మేపారి
త్రిభువనవ్యాప్తి నుద్దీప్తమయ్యె

గీ. నింతయును జూప[2] నడఁపంగ నెంతయును బ్ర
వీణుఁడవై దేవ నీమాయ వినుతి కెక్కె
విమలకమలాక్ష సదవనదక్షకటాక్ష
విగతపరితాపవ్యాప్తిప విశ్వరూప. 31

క. కేవలకరుణామూర్తివి
గావున భక్తాభయత్వకరణము పని నీ

1. హస్తోత్త్రేయ, హస్తోచ్చేయ. 2. నడుఁగ.

కీవిశ్వముగాఁ జుట్టకై
శ్రీవల్లభ [1]యెప్పుడు నవతరింతు నిజేచ్ఛన్. 32

చ. కడఁక దలిర్ప నీవు మధుకైటభదైత్యులఁ జక్రధారచే
మెడలు చెగంగ వ్రేయు నెడ మిన్నుకుటై మెఱతపీయరక్తముల్
వడిసిన యోటికల్ నెఱయ వ్రాసినలత్తుకభంగిఁ జోద్యపుం
బొడవుగ నొప్పనీతొడవుతోరపుటొప్పనలంతు మాధవా.

చ. చదువులు గోలుపోయి యొకజాడయుఁ గానక బమ్మరించున
మ్ముదుసలివేల్పు చేర్చి వెస మ్రుచ్చుబఠిం బ్రళయాబ్ధినీట గ్ర
క్కదలఁగ దాడి వెట్టిన [2]యఖర్వభవత్తిమిరూప మిప్పుడున్
మదరుచి గ్రోలుచుండు మునిమానసపూరములం జగన్నిధీ.

చ. కమఠతనూవిలాసమునఁ [3]గవ్వపుఁగొండ ధరించి తేవ న
య్యమృతముఁ దెచ్చి యాశ్రితజనావలి కిచ్చితి నేఁడు నమ్మహా
కమఠతనూవిలాసము దగన్ దలఁపన్ గొని యోడఁగన్న వా
రమృతముఁ గాంచి నిర్మలసుఖాంబుధిఁ దేలుదురా హృషీకశా.

చ. గొరిజలఁ ద్రొక్కినం బ్రిదిలికుండలిభర్తయు దుంగ నాస్పులం
దొలి మహార్ణవోదకము ద్రిప్పకొనం బటురోషతాడనన్
జిరిఁగి యజాండకర్పరము చిల్లులువోవఁగ యజ్ఞపోత్రివై
ధర పదిలంబుగా నిడిన తావకలీలఁ దలంతు మవ్యయా. 36

ఉ. ఖేదము లేక యజ్ఞమయకేసరముల్ గదలంగ విస్ఫుర
న్మేదురహేషితధ్వను లమేయములై ప్రణవస్వరూపతన్
రోదసి నిండఁగా హయశిరోవపువొప్పయు గాంతసంభ్రాంతిన్
వేదము లుద్ధరించినపవిత్రయశోండవు నీవు శ్రీనిధీ. 37

1. యెప్పుడును నవతరింతు. 2. నఖర్వ. 3. గర్వపుఁగొండ ధరించు తేవనీ.

మ. స్ఫురదాశాప్రజటాకలాపములతోఁ బూర్ణేందు[1]సౌందర్యసుం
దరవక్త్రంబులతో మహోగ్రఘనకోదండేషువిస్ఫారభా
సురపూర్వాపరభాగవైభవముతో సొంపారునీరూపముల్
నరనారాయణనామధేయములు [2]వర్ణించెల్ జగన్మంగళా.

ఉ. భూరితపస్సమిద్ధ దురభూతసమృద్ధుల నొప్పునీసమ
గ్రాకృతదివ్యరూపముల నన్నిటి నిట్టివి నా నెఱుంగ సం
స్ఫీత నుతింప శక్తుఁడె విరించియుఁ, గేవలభక్తియుక్తులన్
గాతవులన్ కృపాగరిమఁ గావుము మమ్మఖిలాండనాయకా.

క. గోవింద కృష్ణ కేశవ
శ్రీవల్లభ పద్మనాభ శ్రీకర పితరా
జీవాక్ష చక్రధర నీ
సేవకుల ననుగ్రహింపు శీతలదృష్టిన్. 40

క. హరి వనమాలికాధర
గరుడధ్వజ శార్ఙ్గధన్వ కాంచనవర్ణాం
బరధర కౌస్తుభరత్నా
భరణా ప్రసన్నుఁడవు గమ్ము పాలింపు ననున్. 41

క. వైకుంఠనాథ వయితక
థాకుంఠితకరుణచతుర్ధర్మావన దీ
నానల్పభవచ్ఛరణా
జైకోయనత్త్వ మాకు నభయ మొసఁగవే. 42

ఆ. అమృత యభవ యలయు యక్షయ యవికార
యప్రతర్క్య యనఘ యజిత యచల

1. సోదర్య అని యుండును. 2. వర్ణంబుల్.

యప్రమేయు యమల యాద్య యనాద్యంత
యాప్తమతుల మమ్ము నవధరింపు. 43

వ. అని యనేక ప్రకారంబులఁ బ్రస్తుతించుచు సభక్తికచిత్తులై యున్న యన్నాకౌకసులఁ గరుణావలోకనంబునం గైకొని యాలోకేశ్వరుండు మీదెసఁ బ్రసన్నుండ నైతి నెయ్యది యిష్టం బేమికారణంబునం జనుదెంచితి రింతదైన్యం బేల వచ్చె మీయాపద యపనయించెద నెఱింగించునది యనిన దెంపంబులఁ గొందలంబులు డిందుపడ బృందారకు లందఱు నందంద సాష్టాంగదండప్రణామంబు చేసి యిట్లని విన్నవించిరి. 44

తే. దేవ దేవేశ దేవరదివ్యచిత్త
మునకు గమ్యంబు గానిది భువనకోటి
నెందఱం గల్గునే నైన యేము విన్న
వంబు చేయఁగ [1]వినుఁ డభిప్రాయము మెయి. 45

వ. చిత్తగింపుము దితిసూనుం డైనహిరణ్యకశిపునకు హిరణ్యగర్భుండు వరం బిచ్చి యధికుం జేసిన నయ్యసురాధముండు క్రోధమాత్సర్యంబులు దన్నుం జుట్టుకొనఁ బెరిఁగి యదితిసంతతిం బరిభవించి త్రైలోక్యదుర్జయుం డై యున్నవాఁడు.

తే. [2]బలియునింట బానిస నైనఁ బఱప [3]వెఱచు
నొరులు నీయింటిదాసుల నోట లేక
మమ్ము నసుర భంజించుట మాకుఁ జెప్ప
సిగ్గు లయ్యెడు నిందు వచ్చితిమి దేవ. 47

1. వినుఁడభిప్రాయము. 2. 'బలియు నింటి' 3. 'వెఱతురొరులు'.

సీ. అలఘుపరోషస్ఫురత్సురాధిపతిప్రగదాహతిఁ గడుఁ
గలఁగినమస్తకంబు లివె కల్పితదానవతర్జనంబుల
గ్లానిఁ బెం బాలుమోము లివె నిష్ఠురదైత్యనిశాంతసేవమై
నలఁగిడఁబడ్డమోము లివె యయ్య కృపం బరికించి కావవే.

తే. ఆహిరణ్యకశిపుఁ డసురసమస్తము
పదలు గొనిన దివ్యపదముఁ బాసి
యిప్పు డున్నవార మిల హిరణ్యకశిపు
హీను లైనసురలలోనఁ గలసి. 49

ఉ. దానవుచేతఁ గప్పబడి దైన్యము నొందుట కోర్వలేక నీ
దైవపదాంబుజంబు లభయం బని చేరితి మెవ్విధంబునం
దైనఁ బ్రసన్నమానసుఁడ వై మముఁ జేకొనవయ్య మాకుది
క్కైనను గాక యున్నసురాంతక! నీవ కదయ్య యెన్నఁడున్.

వ. అని కృపణవృత్తిం బలుకు దివిజులపల్కులు మనస్కరించి మధు
మథనుండు కొండొక యూహించి యనంతరంబు వారల
కి ట్లనియె. 51

చ. ఎఱుఁగుదు నేను దైత్యునియుదీర్ణమదోద్ధతచేష్టితంబు మి
మ్ముఱక పరాభవించుటయు నుల్లమున న్దలపోసి వానికిన్
గొఱఁతలు నిండునంతకును గ్రూరతఁ గైకొనకున్నవాఁడ నన్
క్కఱఁ దిమిరం బడంపఁ దిమిరారియుఁ బూను నె వేగకుండినన్.

వ. అమ్మహాసురుండు సరసీరుహాసనుఁ బ్రసన్నుఁ గావించిన
యప్పుడుం దనకుం జావు లేకుండ ననేకప్రకారంబులు
యోజించుకొని వేఁడినవాఁడు గావున వాఁ డడిగినచం
దంబు లెయ్యవియుం గాకుండ నొక్కటి తత్ప్రశమనో

పాయంబు నిరపాయంబుగాఁ బ్రయోగించుటకు నూహిం
చినవాఁడ నని యెట్లనిన. 53

సీ. ఆననభంగి పంచాననసమరేఖ
 [1]యఖిలాంగమును బురుషానుకారి
తీవ్రనఖంబులు తీవ్రశస్త్రంబులు
 సంధ్యాముఖము ఘనశౌర్యవేళ
విపులాంకపీఠంబు రిపునకు వధశిల
 తద్భుజామధ్యభేదనము గదన
మమరభుజంగమర్త్యావాసనిగ్రహా
 నోదన విజయప్రమోదలీల

గీ. యిట్లుఘోరాద్భుతస్ఫూర్తి నెసకమెసఁగ
నతులనరసింహభవ్యదివ్యావతార
మేను ధరియింతుఁ దడవులే దింక నార్తిఁ
గలఁక విడువుఁడు దేవతాగణములార!. 54

క. విసుఁ డాశ్రితరక్షణమే
యనువునఁ గావింతునొక్కొ యని యనిశము నే
మనమునఁ దలపోయుదు మఱి
తునె శరణాగతులవిమ్ము దురితరహితులన్. 55

చ. ఒకమఱి నన్నుఁ బేర్కొనిన నుల్లమునం దొకమాఱు నర్గసభ
క్తికమతియై తలంచినను దెల్లము భక్తుఁడు వాఁడు నాకు, వా
నికిఁ గలనేను, వేఱొకటి నేరక నన్నుఁ దలంచుపుణ్యులఁ
బ్రకటదయానురక్తిఁ బరిపాలనసేయుట చెప్ప నేటికిన్. 56

1. యఖిలాంగములు పురుషానుకారి.

ఉ. చెప్పితి సర్వవేదములఁ జెప్పితి శాస్త్రవిచారపద్ధతిన్
జెప్పితి సత్పురాణములఁ జింతితకల్పమహీరుహాంబుజా
నొప్పఁగ నీవు కీర్తనకు, యుగ్రతపంబులఁ జెందు పుణ్యముల్
జొప్పడు సద్వివేకగుణశోభనముం గొనియాడ నేర్చినన్.

క. ఏవారును నన్ను నెఱుఁగరు
గావునఁ ద్రైలోక్యహితముఁ గావింపంగన్
భావము వెలువడ నుండుదు
నీవిశ్వంబునకు నేన యొప్పెడు కరణిన్. 58

తే. సకలభూతజాతములకు సముఁడ నేను
వినరె దుష్టయుక్తధర్మవిద్వేషు లైన
తామసాత్ముల నైరింప ధర్మబుద్ధిఁ
బొగడఁ గనినసాత్త్వికతతిఁ బ్రోతుఁ గరుణ. 59

వ. మీరు సాత్త్వికచిత్తులరు గావున నాకు సపక్షరక్షణీయులు. తామసమర్దనంబు గార్యంబుగా నాకు మీ రెవ్వరుం జెప్ప వలదు. మీపదంబులు మీకును స్థిరంబులై సవిగాఁ దలంచి నిరాతంకహృదయులరై యుండుఁడు. పొండని యానతిచ్చిన నాజగన్నాథువచనంబులు మహాప్రసాదం బని యంజలిరచనారమణీయంబు లగుఫాలభాగంబులఁ బరిగ్రహించి పురందరాదిబృందారకు లానందంబున నానందకహస్తుచేత నామంత్రితు లై మఱలి భావినరసింహరూపప్రకారం బూహించి యాశ్చర్యకుతూహలప్రమోదభక్తిపరవశమానసు లగుచుఁ దత్కాలోచితోదగ్రప్రవర్తకం బగువాచస్పతిఁ బ్రస్తుతింపుచుఁ బరమేశ్వరు వాక్యంబుల నానావిధంబులఁ భావించి సంతసిల్లుచు నిజస్థానంబులకుఁ జని రక్కాలంబున నచ్చట. 60

చ. జగములు మూఁడు గెల్చి యొకశంకయుఁ గింకయు లేక దైత్యుఁడ
త్యగణితవైభవంబున నిరంతరభోగపరంపరారతిన్
దగిలి మనంబు కోరినవిధంబుల వేడ్కలఁ దేలుచుండు సొం
పుగఁ దనధర్మపత్ని యగుపాత్రిముఁడాను సుదాత్తలీలలన్,

చ. ఉదధిపురోద్ధ స్థపతియొద్ద నిలింపకులేంద్రునొద్ద ను
న్మదకలలీలఁ గ్రాలు నెలనాఁగలు నాగరికంపుఁజందముల్
పొదల విలాసహాసము లపూర్వపుగర్వములం దలిర్ప న
య్యదితిసుతాహితుం గొలుతు రమ్ముదమొందినయట్లజస్ర
మున్. 62

క. విశ్వావసుతుంబురులును
నశ్వముఖులు నదుగు దెంచి యందఱు నాదై
త్యేశ్వరు నారాధింతురు
శశ్వత్సంగీతకప్రసంగప్రౌఢిన్. 63

శా. వీణావేణుమృదంగసంగతకళావిన్యాసములన్ బంధుర
శ్రోణీరమ్యఘనస్తనీనటనచారుప్రేక్షయున్ సంతత
ప్రాణప్రీణనగంధబంధవిలసత్కాదంబరీకేలియున్ [న్.
[1] ప్రాణంబు ల్దనకొం డెఱుంగఁ డతఁ డెబ్భంగిన్ సమస్తక్రియ

సీ. అమృతశీకరసేకహారితవనావలీ
సుందరమందరకందరములు
రత్నపుష్పామోదరమ్యకాంచనలతా
కోమలమేరునికుంజములును
గనకాంబుజామోదఘనరుక్తవాలుకా
లలితమందాకినీపులినములును

1. ప్రాణంబుల్ దలకొం.

హంసకుటుంబనిత్యావాసహేమాబ్జ
చారుమానససరిత్తీరములును

తే. నాదిగాఁగల్గు దివిజవిహారభూము
లన్నియును దానునై వేడ్క లగ్గలింప
ననుదినంబును నచ్చరల్వెనుకఁ దిరుగఁ
దానుఁ బ్రియయును విహరించె దైత్యవిభుఁడు. 65

క. ఇట్లు సంతతప్రమోదంబు లగువినోదంబులఁ గాలంబు చను
చుండ నొక్కతఱి వసంత సమయావసానం బగుటయు. 66

సీ. ఒయ్యన మాధవీలతల నుండుట లుజ్జనఁ జేసెఁ దుమ్మెదల్
గ్రుయ్యగఁ బాఱె పాటలతరుప్రకరంబుల మూఁగె నుక్కు
నన్,పియ్యనిపింటికి స్మరుఁడు దీసిన[1]యమ్ముల గాన మెచ్చెఁదా
నెయ్యెడ మల్లెక్రొమ్మొగడ లేపుఁ బాంథుల వేటలాటకున్.

చ. మలయజవారిసేకముల మౌక్తికనూతనహారవల్లులన్
వలిపెపుసన్నకావులను వారిరుహాక్షుల పేఁగుఁజన్నులన్
గలిగినచల్మిరిం బ్రదికెఁ గాక జనావళి యిట్టివేసవిన్
గలదె శరణ్య మన్య మనఁగాఁ గడుఁ జేర్చె నిదాఘదావా
ముల్. 68

తే. అదరిపాటున వేసవి పొదవికొనినఁ
గలఁగి తలఁగి పోనేరక మలయపవనుఁ
డిందుఁ దలదూర్చికొనియె నా నింపొనర్చె
నమరుతాలవృంతముల మందానిలంబు. 69

---

1. యమ్ములు.

మ. [1]తమచుట్టుం బయలైననూత్నశశికాంతస్ఫారవేదుల్ మహో
ద్యమచంద్రోదయలీల రేలుగరఁగం దత్తోయసంసేవనల్
గమియం దన్వొసఁగంగనొప్పెసఁగెఁ గత్కేళి కాంతారభూ
జము లొప్పెమియుఁ గోలుపోకకదుపిస్ఫారంపుఁబెన్వోసవిన్.

చ. రమణభుజానిపీడనఁ గరంగినకాంతలవిస్ఫురన్మితం
బములఁ దలిర్చు పన్నవలిసంబులు వీడియు జాఱవయ్యెఁ జె
న్నమరవినూతనక్షతనఖాంకము లింపెసలారఁ గ్రమ్ము నుం
జెమటల జాల బచ్చులయి చిక్కఁగ నంటి కొనంగఁ జేసినన్.

చ. పరిమెయిమెట్టితో ల్తబవాఁభంగులఁ గ్రాలెదుమిత్రు జైత్రు సిం
బొరిగొన [2]వచ్చు గ్రీష్మమనుపొచ్చెపుఁ [3]బేరిపురారిఫాలభా
సురపటువహ్ని యంచు వెఱఁజొచ్చినమన్మథుఁ గాచె నత్తఱిన్
సరసశిరీషకేసరలసన్మహితామ్రదళాలకాగ్రముల్. 72

తే. పగళు లెలతోఁటనీడలు బ్రాఁతియయ్యెఁ
బగళులును రేలు దనుగాలి బ్రాఁతియయ్యె
రేలు వెన్నెలబయళులు ప్రియములయ్యె
రేలుఁబగళులు నిద్రలు ప్రియము లయ్యె. 73

వ. ఇట్టి ఘర్మసమయంబున నసురవల్లభుండు వల్లభాజనసహితం
బుగ నొక్కనాఁడు నిజమందిరాభ్యంతరకేళీకాంతారంబు
నందు. 74

సీ. ఎండకన్నెన్నఁడునెఱుఁగని క్రొమ్మావి
 నీడలఁ దనుపారు నెలవులందుఁ

---

1. తమచుట్టం. 2. వచ్చె. 3. బేరఁ బురారి.

గడిగొట్టు: బుష్పాలంకలి తేనియలవానఁ
 పడిసినపాదపంక్తిమొదములందు
చిరియుమూఁకించు క్రొవ్విదపుమల్లియమొగ్గ
 లెలబావిఁ జొక్కించు నిక్కులందు
గాయంపమొఱకలరాయిడిఁ దుప్పర
 పల్లెపు కొలఁకులచలువలందుఁ

గీ. జికిగితెకిగి పెక్కు పెఱఁగులయాటల
 మెఱసి మెఱసి చెన్ను మిఁగిలిమిగిలి
 క్రాలఁ బ్రొద్దు మాపకడ నయ్యెఁ గలువల
 మ్రొక్కు దైవమునకు నెక్కె ననఁగ. 75

తే. ఇట్టివేసవితఱిఁ బగ లిట్టినిడివి
 నైనపయిరించునే డివిజారి యనుచు
 వెఱచి తొలఁగెడు తెఱఁగున వేఁడివెలుఁగు
 వరుణుఁ డేలెడు దెసవొక్కవలనవొదిఁగె. 76

వ. ఇను నసమానతేజు దివసేంద్రుఁగనుంగొనుమాడ్కిఁ జూడఁగాఁ, జన వొరు నల్పతేజు ననుచాఁస్వనఁ జంచలభృంగతారకా, ఘనవనజాతలోచనము గ్రక్కున మీలన మొందఁ జేసెఁ బద్మిని పతిభక్తి సత్త్వమున మేలిమికిం గుఱి దాన పో మ్మనన్. 77

చ. సురుచిరతారకాకుసుమశోభినభోంగణభూమిఁ గాలము
 న్నయనవపుసూత్రధారిజతనంబున దిక్పతికోటిముందటన్
 సరసముగా నటింపఁగ నిశాసతి కెత్తినక్రొత్తతోఁపుఁబెం
 దెర యన [1]నొప్పెసాంధ్యనవదీధితి పశ్చిమదిక్తటంబునన్.

---

1. నొప్పు.

క. నలుదెసలయందుఁ దొలితొలి
తలసూపు నమఃప్రరోహతతులు వియోగా
కులచక్రవాకమిథునం
బుల వగయనుచిచ్చు రాఁజు [1]పొగలనఁ దగియెన్. 79

తే. [2]పొదలి యొండొండ దివియును భువియు దిశలుఁ
బొదివికొనియుండు చీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి
[3]కరవటంబన జగదండఖండ మమరె. 80

ఉ. రాజితతేజుఁడై నడిన రాజుతిరోహితుఁడైనపిమ్మటన్
రాజదయాద్రిపీఠముతిరంబుగ నెక్కెడునంధకట్టునన్
భ్రాజితసత్వదంబునకు బాధయొనర్చుచు జారచోరసం
పూజితమైతమంబుగడుఁ బొంగె నధర్మము [4]తోడిజోటియై.

క. పదపడిపూర్వదిశాసతి
వదనంబునఁ దెల్పు [5]మిగిలె వచజాహితుచూ
లుదరంబునధరియించినఁ
గదిరినపాండురకపోలకాంతివిధమునన్. 82

వ. అంత. 83

సీ. తిమిరభూతముసోకు [6]తెరల జగత్త్రయీ
లలనదాల్చినరక్షతిలకమనఁగ
నఖ్యంబునకుసిశాసతి యొసంగినఁ బ్రాచి
ప్రాపించు గురివిందబంతియనఁగఁ

---

1. పొగలనడఁగియుఁన్. 2. పొదవి. 3. కరపటంబున. 4. తోడిచోటు
తై. 5. మిగిలి. 6. జలియ.

దోయధివెడఁ గ్రుంకి తోఁచుపుటంబర
కుంభినీఁ బూరితకుంభ మనఁగఁ
గుల్కలాయుధుని పెద్దకోలువున నెత్తిన
దీపించు మాణిక్యదీప మనఁగఁ

గీ. కుముదినీరాగరసబద్ధగుళిక యనఁగఁ
గామశింజనీషట్పదకళిక మనఁగఁ
జొడవు పెంపునబింబంబు పోలుపుమిగులఁ
జంద్రుఁ డుదయించెఁ గాంతిని స్తంద్రుఁ డగుచు. 84

వ. ఇట్లుదయించి. 85

చ. [1]దెసలను గోష్ఠలోయ్యనతి విభ్రము లైనకరంబులన్ బ్రియం
బెసఁగఁగ నూఁదసిక్కి రజనీశ్వరుఁ డున్నతలీలఁ [2]బేర్చునా
కసమును వేదిభూధరము కాంతసిరంతటఁ దాఁక కాలస
త్కుసుమచయంబు గోయుట కొకోయన బ్రాఁకెసుమిత్సకా
కృతిన్. 86

ఉ. వెన్నెలవెల్లి పాల్కడలి [3]వేఁకదనంబునఁ జేర్చి దిక్కులన్
మిన్ను నుమ్ముంపనందు రజనీకరబింబము కుండలీభవ
త్పన్నగతల్పకల్పనము భంగిఁ దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు వేడ్కయొనర్చెఁ గలంకమత్తటిన్.

చ. వడిగొని తేకులుప్పతిలవాలిన కేసరముల్ దలిర్పఁగా,
బ్బాడిదల మెక్కి తేనియలు పొంగి తరంగలుగాఁ జెలంగి పైఁ
బడు నెలదేఁటిదాఁటులకుఁ [4]బందువులైన వసౌరభంబులు
గ్గడువుగ నుల్లసిల్లె ఘనకైరవషండము నిండువెన్నెలన్. 88

---

1. దిసలను. 2. దేర్చు, చేర్చు. 3. మించియందు. 4. బందువలై.

ఉ. వెన్నెలవెల్లపచ్చడము విచ్చినయంబరశయ్యమీఁదఁ బే
రన్నననుండి దిగ్వనితలాదటఁ జుట్టునుగొల్వ రాత్రి యన్
కన్నియఁగూర్మి చిక్కఁదనకౌఁగిటఁ జేర్చి సుఖించినాఁడసన్
జెన్నువహించె జందురుఁడు శ్రీకమనీయకళంకరేఖతోన్. 89

సీ. కరఁగెడునవచంద్రకాంతోపలంబుల
తఱచు సోనలఁగడు దలముకొనుచుఁ
జటులచకోరసంచయముల యొఱకల
గర్వంపుబాఁటులఁ గడలుకొనుచు
విరియుకైరవములవిపులరంధ్రములపైఁ
దీవ్రంబుగాఁ గ్రమ్మి త్రిప్పుకొనుచుఁ
గామినీజనములకమనీయవిభ్రమ
స్మితకాంతిలహరుల మెండుకొనుచుఁ

గీ. బొదలిపొదలి చదలఁ బొంగారిపొంగారి
మించిమించి, దిశలుముంచిముంచి
[1]యభినుతేందుచంద్రికాంభోధి యఖిలంబు
నీటు నిట్టలముగ నిట్టవొడిచె. 90

వ. ఇట్లతిమనోహరగంభీరధీరంబైన సుధాకరకాంతిపూరంబు రాత్రి యనుతలంపుఁ దోఁపనీక తమం బనునామంబును విననీక యవ్యక్త యనుశంక నంకురింపనీక లోచనంబులకు నమృతసేచనంబును, శరీరంబులకుఁ జందనాసారంబును, నంతరంగంబులకు నానందతరంగంబును నగుచు విజృంభించిన సమయంబున. 91

1. యభినుతేంద్ర.

క. తన దేవియుఁ దానును న
ద్దనుజవిభుఁడు విమలసౌధతలమునఁ గాంతా
జనపరివృతుఁడై సురతపు
జనితములగు మధురమధురసంబులు వేడ్కన్. 92

క. తెప్పించినసహజసౌరభ
మొప్పారఁగ దివ్యరుచిసమున్నత[1]ములునై
యుప్పొంగువానిఁ గనకపుఁ
జిప్పల నిండించె మగము చిప్పిలుచుండన్. 93

ఉ. అంతటఁ గైకొనంబడిచి యాదటఁ గాంతయుఁ దానునొక్కచో
రం దనుపార దివ్యమదిరామధురామృతపానకేళి యం
దంతయొనర్పఁగాఁ దొడఁగెనంబుజనేత్రులవిభ్రమక్రియా
కందళితంబులై నసవికారవిహారములింపుఁ బెంపఁగన్. 94

క. ఆరమణులమదిరారస
పూరిత[2]చషకములఁ దోఁచుపూర్ణేందుఁడు పొ
ల్పారెను వాసనకై క
ర్పూరంపుం [3]బల్కులిడినపోలిక యమరన్. 95

మ. నెలఁతయొకర్తు చేతిహరినీలశిలామయపాత్రిఁ బూర్ణసం
వలితతరంగయై పొదలువారుణిఁ దోఁచుసుధాంశుమండలం
బలముకరాళిరాహువదనాహతి స్రుక్కి కరంబుఁ బిమ్మిటం
గలఁగి పొరింబొరిన్ వడఁకుకై వడిఁ గానఁగనయ్యె నయ్యెడన్. 96

చ. సురుచిరపానపాత్రమున సుందరియొక్కతె కేల నింపుచం
దురుఁడు ప్రకంపితాంగములతోఁ దిలకించెఁ దదాననాంబుజ

1. సముల్లై. 2. ఝషకము. 3. బల్కులిడిన; బలుకుల్లిడిన.

స్ఫురితవికాసవైభవము సొంపులడంకువ ద్రుచ్చిలించి చె
చ్చెరఁ జనుదెంచి పట్టువడి చేడ్పడి భీతివడంకు చాడ్పునన్. ౯౭

చ. పాలఁతుక[1] యోర్తె యొప్పుమధుపూరితపాత్రికఁ గానవచ్చుచు
జ్వాలహిమధామ చేతఁ దనవక్త్రముకాంతికిఁ గాంతిపూరముల్
[2]గలయఁగఁ ద్రచ్చితేర్చి యొడికంబుగఁ బుచ్చిన వెన్నకల్లుతోఁ
గలపికరంచి క్రోలుటకుఁగా నిడికొన్న తెఱంగునందగన్. ౯౮

ఉ. ఈరసశీలరామవదనేందునిఁ జెంపిపవిత్రమైన యి
వ్వారుణిఁ గాని పాయసు ధురీవంబుగ నాత్మకలంకమంచు నిం
పార మునింగెఁగాక యమృతాంశుఁడనన్ బ్రతిబింబచంద్రుఁ
[3]డొ,ప్పారెనొకర్తు చేతిసముదంచితకాంచనపానపాత్రికన్.

తే. [4]చషకమునఁ గామినీముఖచంద్రుఁ డనుసు
ధాంశుఁడును బింబితాంగులై యలరుటొప్పె
నర్థిఁ దమలోనఁ జెలిమిసేయంగ శపథ
మునకు వరుణాత్మజాజలో మునిఁగినట్లు. 100

వ. ఆసమయంబున. 101

చ. ఎనసిన[5]రాగబీజమున నీరికలెత్తినవప్రహాసముల్
ఘనతరశాఖలై యలమొగంబులఁ గెంపులు పల్లవచ్ఛవిన్
బనుపడ వాలుకన్గొనలఁ బర్వ మెఱుంగులు పుష్పలీలగాఁ
దనరె[6]నితంబినీజనము తద్ధ్రుమరూఢి సురాంబుసేచనన్. 102

వ. ఇట్లు మదిరాపానమత్తలైన మత్తకాశినులయుద్వృత్తవిహా
రంబులు నుత్తమలావణ్యసంస్కారంబులు నృత్తగీతవాద్య

---

1. యోర్తు. 2. గలయఁగఁదేర్చి త్రచ్చి. 3. ప్పార. 4. ఝషకమున
5. రాగ. 6. నితంబినీజన దటద్ద్రుమరూఢి.

కళావిలాసంబులుగానిపించుచు సాంద్రానందహృదయుండై
పెద్దయుం బ్రొద్దు వినోదించి యందఱం బోవం బనిచి. 103

క. లలితోత్తరచ్ఛదంబగు
తలిమంబునఁ దానుహృదయదయితయు రాగా
కులసుప్తిఁ బొందె గంగా
పులినతటాభ్రము మహేంద్రప్రదంతి క్రియన్. 104

వ. అంత. 105

క. కలఁగాంచి యసురవల్లభ
కులభామిని మేలుకాంచి పతికాద్భుతసం
చలితాంతరవశయై యా
కులభావము నొంది చెంది కొండొకసడికిన్. 106

తే. పూర్వదేవవిభుండు ప్రబుద్ధుఁడయ్యె
సతినిజస్వప్నవృత్తంబు పతికిఁజెప్ప
వెఱచి మతినున్చికొనియుండె విచలమధుప
[1]కలితసుప్తపంకజయగు నలినిపోలె. 107

ఉ. రాతిరియెల్ల జాజి[2]నను రాగముతోడఁగుముద్వతీరతిన్
బ్రీతిభజించి ఖేదమునఁ బ్రేయసియుం సొగియంగ[3]దానును
ద్భ్యాతపరిశ్రమార్తుఁడగుపోలెఁ జంద్రుఁడు పశ్చిమాబ్ధిలో
యాత్యతలసుప్తికై[4]డిగెనల్పసభాసితాంగరాగుఁడై. 108

ఉ. చల్లనివాఁడుగావుననిశాకరుప్రాపున దీప్తిలీలమై
నెల్లజగంబులు న్మిగిలియిమ్ములనుండితిమింత నెంతయున్

---

1. కేలిసుప్తపంకజముగునలినపోలె. 2. జాజియును. 3. దానను.
4. డిగియ; 'డిగెరో.'

దెల్లముత్రిప్రమూర్తి యొరుతేజమునై పడు భానుఁగూడిన
ర్తిల్లఁగవచ్చునే యనుగతిఁ దివిచుక్కలడంగెఁదోడుతోన్.

తే. అంచితోద్యానవాటికలందు నవవి
భాతదళితకుసుమవిభాతి యమరె
నప్పుడరయంగఁ జంద్ర[1]కరాబ్ధివెల్లి
డొంకిచనఁ దోఁచునురువుతెట్టువలనంగ. 110

సీ. వెడవెడమూతులువిచ్చుతామరలపై
సుడిసి నెత్తావులుసూఱలాడి
యనుఁగుఁదోఁటలు సొచ్చియలరుతేనియఁ జేసి
యొలదేఁటి పదువులఁ జెలఁగినడచి
రాయంచకవలనిద్రలు దెల్పికొలఁకులఁ
దరఁగ యుయ్యలయాట దగులుపఱిచి
సౌర్ణగంధులుసొచ్చి సురతఖేదమునందుఁ
జెలువలఁజెలువుర సేదదేర్చి

గీ. యడరి గృహపతాకికలకు నాటగఱపి
ప్రోది నెమళులయెఱకలపొదులువిప్పి
మందసంచారముగ సుకుమారమగుచు
మెఱసెఁబ్రత్యూషసమయసమీరణంబు. 111

క. రవిరాకకుఁ బూర్వదిశా
యువతిగృహాంగణము కుంకుమోదకసేక
ప్రవిభాతమయ్యెననఁగా
నవారుణోదయవిజృంభణము విలసిల్లెన్. 112

---

1. వరాబ్ధి.

మ. సరసస్నేహఘనంబులాయతదశాసంసక్తముల్ కజ్జల
స్ఫురితోపాంతము లిప్తభూరివిషయంబుల్ కామినీనేత్ర భా
సురరోచుల్ దమునేఁడు ద్రుంచుకొనిరే సుస్నిగ్ధరాగంబులై
పరగంగా వెల వెల్లనయ్యె గృహదీపవ్రాతముల్ వేకువన్.

మ. అలినీమంజుల-గీతులుం బటుతరంగాలోలనాదంబులున్
విలసత్కైరవలాసికాక్ష్ణ సుమనోవృష్టి ప్రచారంబులుం
గలహంసీవరకీరానులాపములునై గంభీరపద్మాకరం
బులు గోకద్వయసంగమోత్సవములం బొల్పారెఁ గాల్యంబునై.

వ. అంత. 115

మ. అనితరకాంతఁ బద్మినిఁ బ్రియాతిలకంబు మొఱంగిపోయి రే
యొనసిన వేశ్య నొందుననయిచ్చ మెయిస్వీహరించి[1] మేనసం
టిననవరాగలీల జిగిదేరఁగ*నొడియొదింగిమోయ్యనొ, య్యనఁ
బొడచూపెనానుదయమయ్యెఁ బతంగుఁడు ప్రాఙ్ముఖంబునన్.

సీ. కమనీయదిగ్వధూకర్ణపల్లవములా
కాళికింశుకకోరక ప్రతతులు
వాసరవారణవదన సిందూరముల్
వనరుహాకుంకుమోద్వర్తనములు
కుముదినీనవతపస్క్రమవల్కలంబులు
తిమిరాపహరణ ప్రదీపశిఖలు
త్రైలోక్యమందిరరత్నతోరణములు
ప్రత్యూషనటరక్త పత్రకంబు

---

1. వ్రెంచు 'వీఁగుదెంచు' అని యుండునేమో. 2. గీతులం. 3. కాంతిఁ.
4. జంటిన: *తొ,డిన నవరాగ.

గీ. లసఁగ నూతనంబులై కెంపులై సొంపు
లలర మణిమరీచు లతిశయిల్ల
నఖిలభువనమంజులాంజలిపుటపూజ్యు
మానుఁడగుచు బాలభానుఁ డొప్పె. 117

వ. ఆసమయంబున నసురేశ్వరుండు విహితదినముఖవ్యాపారుండై యంతఃపురంబు వెలువడి యాస్థానభవనంబునకు వచ్చి సకల సురరిపుప్రకరంబులు పరివేష్టింప నభీష్టచేష్టితంబులఁ వర్తిల్లు చున్నయెడ భృగువంశవరుండును, దైత్యవంశగురుండును నిజమంత్రమహిమావధీరితశక్రుండును నగుశుక్రుండును జను దెంచి హిరణ్యకశిపుంగాంచి యతనిచేత నభినందితుండై వివిధాశీర్వాదంబుల నమ్మహావీరు నభినందితుంజేసి తదను మతిం దదీయ[1]జీవితేశ్వరిని దీవింప నభ్యంతరమందిరంబునకుం జనిన. 118

కు. గురుఁ[2]డాదవ్వులఁ గాంచి సంభ్రమముఁ జత్తుగ ప్రీతియుం భక్తిత,త్పరభావంబును నొప్పనప్పుడు వెసంబద్ధాతిథి ప్రత్యు ద్గమ్యాదరసంసక్తి నమస్కరించెమహితోద్యత్పీఠవిన్యాసను స్థిరసంపూజలొనర్చితత్కృతశుభాశీరుక్తకల్యాణియై. 119

వ. తత్సమీపంబున సముచితాసనంబున నుండఁ గరకమలంబులు మొగిడ్చి యమ్మహాత్మున కిట్లనియె. 120

క. రే యొక కలఁ గాంచితి ముని
నాయక యే నది మదీయనాయకుమది యొ

1. జీవితేశ్వరుని. 2. గురుఁడాదవ్వులు.

ష్ఠి యుండఁ జేయునో యని
యాయన కెఱిఁగింపనైతి నాత్మ నునిచితిన్. 121

క. దైవము కుపితుఁడును బంధుఁడు
సేవధముఁడ నాకు మీఁద నీప్సితశుభస
ద్భావంబులు సతతంబును
గావింపఁగఁ గర్తగాఁడె కవిజనవినుతా! 122

సీ. అవధరింపుము జలదాసితవర్ణుఁడు
ఘనశంఖచక్రలాంఛనభుజుండు
మహితకోమలవనమాలాసలక్షణ
వక్షుఁడు వికసితవారిజాక్షుఁ
డభినవపీతాంబరావృతదేహుండు
భూదేవుఁ డొక్కఁ డపూర్వలీలఁ
జనుదెంచి నన్నుఁ జూచి సస్మితవదనుఁడై
తనచేత నొప్పు సంతానఫలము

గీ. నాకు నిచ్చి మున్ను నా మెడ నున్న హా
రంబు నిజనఖాంకురములఁ దిగిచి
కొనుచు వేగ చనియె నని రాత్రి నేఁగల
గంటి నపుడు మేలుకొంటి ననఘ. 123

వ. వీనిఫలంబెయ్యది యానతీయవలయు ననినఁ గావ్యుఁడు కొం
డొక దలపోసి నిశ్చయించి యద్దైత్యరాజమహిషి కిట్లనియె.

ఉ. ఆధరణీసురో త్తముఁడ వాదియనంతుఁ డనంగ నొప్పు ల
క్ష్మీధవుఁ డచ్యుతుం డతఁడు మేకొని నీకును బుత్త్రు నిచ్చున

